**SRINIVASA BALABHARATI - 93**
***(Children Series)***

KANNAGI

*Kannada Script*
***T.K. Nagambal***

*Telugu Translation*
***S. Chandrasekhar***

T.T.D.Religious Publications Series No.: 948



First Edition : 2015

Copies :

*Published by*

**Dr. D. SAMBASIVA RAO I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P. :*
Editor-in-Chief Office, TTD, Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,Tirupati.

**శ్రీనివాస బాలభారతి - 93**

# కన్నగి

కన్నడమూలం
**టి.కె. నాగాంబాళ్**

ఆంధ్రానువాదం
**ఎస్. చంద్రశేఖర్**



ప్రచురణ
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**
**2015**

## ఆముఖం

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారత పౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం, వారికథలు చెపుతూ పిల్లలకు తెలియజేయగలిగితే, వాటి ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే ''శ్రీనివాస బాలభారతి'' అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలలో ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్న వాక్యాలలో చక్కని కథాకథన



పద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.

కీ.శే.డా॥ ఎస్.బి.రఘునాథాచార్యగారు రూపొందించిన ఈ ప్రణాళికను కొనసాగిస్తూ అదే శీర్షికన చాలా పుస్తకాలను ప్రచురింపజేయటంతోపాటు వాటిని హిందీ, ఆంగ్లం మున్నగు ఇతర భాషల్లోనికి అనువదింపజేస్తున్న ప్రచురణలవిభాగం ముఖ్యసంపాదకులు అభినందనీయులు. ఈ ప్రణాళికలో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

## ఒక్క మాట

చిన్నపిల్లల్లో ధార్మిక జ్ఞానాన్ని కల్గించాలని, బాల్యంలో కల్గిన జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ 'శ్రీనివాస బాలభారతి' పథకాన్ని ప్రారంభించింది. దీనికి అప్పట్లో ప్రధాన సంపాదకులుగా ఉండిన ప్రముఖ పండితులు, రచయితలు, మాజీ ఉపకులపతి డా॥యస్.బి.రఘునాథాచార్యులవారు ఈ గ్రంథాలను పరిష్కరించి తీర్చిదిద్దారు. వీరి నేతృత్వంలో కొన్ని వేల ప్రతులను చిన్న పిల్లలకు అందించడం జరిగింది.

మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహా పతివ్రతలు, మహావీరులు భారతీయ సంస్కృతికి చక్కని పునాదులు.వారి జీవిత గాథల్ని సరళ సుందరశైలిలో, అందమైన ముద్రణతో వెలుగులోకి తేవడం జరిగింది. ప్రస్తుతం ఆ పుస్తకాలతో పాటు మరికొన్నింటిని కొత్తగా చేర్చి దేవస్థానం ముద్రించింది. భావి భారత పౌరులైన పిల్లలకు ధార్మిక సాహిత్య పరిచయం కల్గించాలనే సత్సంకల్పంతో తి.తి.దే. వీటిని అందిస్తోంది.



తల్లిదండ్రులే పిల్లలకు ప్రథమ గురువులు. కనుక వారు కూడా ఈ 'శ్రీనివాస బాలభారతి' రచనలను ఆదరించి, పఠించి వాటి ప్రాముఖ్యమును పిల్లలకు తెలియచేసి వారిచేత చదివించాలి. అప్పుడే ఆ బిడ్డలు అందరూ ఆదర్శ వంతులుగా తీర్చిదిద్దబడతారనడంలో సందేహం లేదు. నేటి మొక్కలే రేపటి వృక్షాలు కనుక ఇప్పటినుండి పిల్లలలో నైతికములైన విలువలను, ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటుచేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగించగలరు. ఆ ఈ సంకల్పానికి ఈ బాలభారతి గ్రంథాలు చేయూతనివ్వగలవని మా విశ్వాసం.

ముఖ్య సంపాదకులు

# కన్నగి

**మ**న భారతదేశం పుణ్యభూమిగా ప్రసిద్ధి చెందింది. దక్షిణ భారతదేశంలో చేర, చోళ, పాండ్య మొదలైన గొప్ప రాజవంశాల వారు పరిపాలన చేశారు.

కావేరి నది ప్రవహించే ప్రాంతంలోని చోళరాజ్యానికి కావేరి పట్టణం రాజధానిగా ఉండేది. చేర రాజ్యానికి వంజి నగరం, పాండ్య రాజ్యానికి మధుర రాజధానులుగా ఉండేవి.

కావేరి పట్టణంలో ప్రసిద్ధి చెందిన వ్యాపారులు చాలామంది నివసిస్తూ ఉండేవారు. వారిలో మానాయగన్ అనే వ్యాపారి గొప్ప శ్రీమంతుడు. అతని వంశానికి కీర్తి తీసుకురావడానికి జన్మించిన ఏకైక పుత్రికే కన్నగి. ఈమె సౌందర్యంలో లక్ష్మీదేవిలా ఉండేది. తెలివితేటలలో సరస్వతీదేవి. లోకమాత అయిన పార్వతిలా అందరినీ అభిమానంతో చూసేది. ప్రజలకు కూడా కన్నగి మీద ప్రేమ అభిమానం ఉండేది.



అదే ఊరిలో మాచాత్తువాన్ అని మరో గొప్ప వ్యాపారి ఉండేవాడు. దానధర్మాలు చేయడంలో అతడు ప్రసిద్ధి చెందాడు. అతనికి కోవలన్ అనే పేరు గల ఒక్కడే కుమారుడుండేవాడు. అతని అందాన్ని, బుద్ధిబలాన్ని, పరాక్రమాన్ని చూసి ప్రజలు మెచ్చుకొంటూ ఉండేవారు. కన్నగి, కోవలన్ వీరిద్దరి కుటుంబాలు సిరిసంపదలతో ఉండేవి. ఇద్దరూ అందంలోను, గుణంలోను గొప్పవారే. వారి తల్లిదండ్రులు వీరిద్దరికీ వివాహం చేశారు. ఎంతో వైభవంగా జరిగిన ఈ వివాహానికి చోళ చక్రవర్తి అయిన మావణ్ణక్కిళ్ళి వచ్చి వధూవరుల నాశీర్వదించి విలువైన కానుకలనిచ్చాడు.

కోవలన్ తల్లిదండ్రులు అన్ని సౌకర్యాలతో అన్నివిధాలా తగినట్టున్న పెద్ద భవనాన్ని నిర్మించి ఆ నూతన దంపతులకిచ్చారు. వారికి సేవ చేయడంకోసం మనుషుల్ని నియమించారు. వారి జీవితం సుఖంగా గడవడం కోసం అవసరమైన సంపదలనూ ఇచ్చారు. కన్నగి భర్తతో సంతోషంగా ఉండేది. భర్తకు అణగి

మణిగి ఉండాలన్న పెద్దల వాక్యాన్ని అక్షరాలా అనుసరిస్తూ ఉండేది. ఉత్తమ ఇల్లాలుగా అతిథులను ఆదరిస్తూ, పెద్దలను గౌరవిస్తూ, బంధువులను అభిమానిస్తూ, అందరికీ ఆనందాన్ని పంచిపెడుతూ కన్నగి సంసారం సాగిస్తూ ఉండేది. ఏ కొరతాలేని ఆ దంపతులను చూసి తల్లిదండ్రులు ఎంతో సంతోషించేవారు.

## మాధవి నృత్యం:

అదే ఊరిలో చిత్రాపతి అనే గొప్ప కళాకారుదుండేవాడు. అతని కుమార్తె మాధవి. ఆమె సంగీతం, నాట్యం మొదలైన కళల్లో నైపుణ్యం గలది. చిన్నవయసులోనే గొప్ప పేరు సంపాదించి చోళరాజు ఎదుట కళాప్రదర్శన ఇవ్వగల సామర్థ్యాన్ని పొందింది.

కావేరి పట్టణంలో ప్రతి సంవత్సరం అతి వైభవంగా ఇంద్రోత్సవం జరిగేది. ఇంద్రుడు వర్షాలు కురిపించే దేవుడు. అతన్ని పూజించడానికి జరిగే పండుగ ఇది. ఈ ఉత్సవం చైత్రమాసంలో పున్నమిరోజున ప్రారంభమై ఇరవై ఎనిమిది రోజులు జరిగేది.



ఆ పండుగ రోజుల్లో కావేరి పట్టణాన్ని పచ్చని తోరణాలతో అందంగా అలంకరించేవారు. సామాన్య ప్రజలు, చక్రవర్తి అనే తేడా లేక అందరూ ఆనందంతో ఆ ఉత్సవాల్లో పాల్గొనేవారు. సంగీతం, నాట్యం మొదలైన వినోద కార్యక్రమాలతో అందరూ ఆనందంగా ఉండేవారు. సైనికులు తమ చక్రవర్తికి విజయం చేకూర్చమని దేవుణ్ణి ప్రార్థించేవారు. స్త్రీలు కూడా దేవాలయాల్లో భక్తితో పూజలు జరిపించేవారు. ప్రతి ఇంటినీ దీపాలతో అలంకరించేవారు. రాజాస్థానంలోని అధికారులు వెండితో ఇంద్రుని విగ్రహాన్ని చేసి రాజవీధిలో నిలబెట్టి కావేరి నదీ నీటితో అభిషేకం చేసేవారు. ఈ ఉత్సవాలలో తమ కళాప్రదర్శనకు అవకాశమున్నందువల్ల కళాకారులకు ఎంతో సంతోషంగా ఉండేది. ఎక్కడ చూసినా ఆశ్చర్యం, సంతోషం కనిపించే గొప్ప ఉత్సవమిది.

ఒకసారి ఇంద్రోత్సవ కాలం సమీపించింది. మాధవి నాట్యకళాప్రదర్శన ఆ సంవత్సరం ప్రత్యేకత.



చోళరాజు ఆస్థానంలోని ప్రతిభావంతులైన శిల్పశాస్త్రజ్ఞులు ఎంతో నైపుణ్యంతో నాట్యమండపాన్ని నిర్మించారు. నాట్యమండపంలో మనుషుల నీడ కనిపించని విధంగా దీపాలనమర్చారు. మాధవి నృత్యాన్ని చూడాలని వేలాది ప్రజలు ఎంతో ఆత్రంగా కాచుకొని ఉన్నారు.

ఒక శుభముహూర్తంలో చోళరాజు సింహాసనం మీద ఆసీనులై ఉన్నప్పుడు మాధవి సర్వాలంకారాలతో ప్రవేశించింది. ఆమె బలగమంతా వేదిక మీదున్నారు. నృత్యం ప్రారంభమైంది. అనేక భావాలను ప్రదర్శిస్తూ, సంగీత, తాళ, వాయిద్యాల కనుగుణంగా, అర్థం, భావం, హృదయాన్ని తాకేటట్టు నృత్యం చేసింది. ఎంత చూసినా ఇంకా చూడాలనిపించే నృత్యమది. రాజు, ప్రజలు ఆ రోజు తమను తాము మరిచిపోయారు.

మాధవి నృత్యాన్ని చూసి ఆ రోజు ఆనందాన్ని పొందిన కళాప్రియుల్లో కోవలన్ కూడా ఒకడు. అతని మనసంతా మాధవితో



నిండిపోయింది. అప్పుడే మాధవి కూడా అతన్ని చూసింది. ఇద్దరికీ ప్రేమ కలిగింది.

## మాధవి – కోవలన్:

నాట్యం ముగిసిన తర్వాత రాజు మాధవికి అనేక బహుమానాలనిచ్చి సన్మానించాడు. ఒక వెయ్యి ఎనిమిది బంగారు నాణాలను, నవరత్నాలున్న హారాన్ని కానుకలుగా ఇచ్చాడు.

ఒకసారి మాధవి దాసి నగరంలోని ప్రధాన వీధులకు వెళ్ళి రాజు ఇచ్చిన హారానికి రెండింతలు వెల ఇచ్చి ఎవరు తీసుకొంటే వారితో మాధవి ఉంటుంది అని చెప్పసాగింది. ఆ హారం చాలా విలువైంది. దానికి రెండింతలు వెలయిచ్చి కొనడానికెవరికి సాధ్యం? శ్రీమంతులనుకొన్న వాళ్ళెవరూ ముందుకు రాలేదు. కాని మాధవి నృత్యాన్ని చూసి కన్నులు చెదిరి ఆమెపట్ల అనురాగంతోనున్న కోవలన్ ఆ దాసి చెప్పిన వెలకు ఆ హారాన్ని కొన్నాడు. ఆ తర్వాత మాధవి ఇంటికి వెళ్ళి ఆ హారాన్నే

తన ప్రేమ కానుకగా ఇచ్చాడు. అతని ప్రేమకు మాధవి ముగ్ధురాలైంది. ఆ రోజునుంచి కోవలన్ మాధవి ఇంట్లోనే ఉండిపోయాడు. ఆమెతో సంతోషంగా గడుపుతూ కన్నగిని పూర్తిగా మరచిపోయాడు. మాధవి కూడా అతన్నే తన భర్తగా భావించి గౌరవాభిమానాలతో ఉండేది.

ఇలా కొన్ని రోజులు గడిచాయి. కోవలన్ దూరమవడంతో కన్నగి దుఃఖానికి అంతులేదు. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. భర్తమీది చింతతో ఆమె పూర్తిగా పిచ్చిదయింది. ఏదీ సహించేది కాదు. ఆభరణాలమీద అలంకారాల మీద ఆమెకు మనసులేదు. ఇంత కష్టంలోనున్నా తన భర్తను కాని, భగవంతుని కాని ఆమె దూషించలేదు. అన్నీ ఓర్పుతో భరించసాగింది.

కోవలన్ మాధవి దగ్గరే సుఖంగా కాలం గడుపసాగాడు. ఆమె పేరుతో దానధర్మాలు చేశాడు. క్రమక్రమంగా అతని ధనమంతా కరిగిపోయింది. ఈ లోపున మాధవికి ఒక అమ్మాయి



పుట్టింది. ఈ సంతోషాన్ని పురస్కరించుకొని కూడా కోవలన్ దానధర్మాలు చేశాడు. అమ్మాయికి ఏ పేరు పెట్టాలి అన్న ఆలోచనతోనున్న కోవలన్‌కు తన తండ్రి తాతలనుండి చెప్పబడుతున్న ఒక విషయం గుర్తుకొచ్చింది.

కోవలన్ పూర్వీకులు పడవ వ్యాపారంలో ప్రసిద్ధి చెందినవారు. ఒకసారి వారు వ్యాపారం కోసం పడవలో వెళ్ళుతూ సముద్రం మధ్యలోనున్న సమయంలో భయంకరమైన గాలులు వీచాయి. ఈ ఘోరమైన అపాయంలో పడవ మునిగిపోయిందనే అనుకొన్నారు. ఆ సమయంలో వారు తమ కులదేవత అయిన మణి మేఖలాదేవిని ఈ ప్రమాదం నుండి రక్షించమని ప్రార్థించారు. దేవి వారి ప్రార్థనలాలించి రక్షించింది. ఆ రోజునుండి వారికి మణి మేఖలాదేవి మీద భక్తి మరింత ఎక్కువైంది.

ఇదంతా గుర్తుకొచ్చి కోవలన్ తన కూతురుకు మణి మేఖలాదేవి అని పేరు పెట్టాడు. మాధవికి, కోవలన్‌కు ఆ అమ్మాయి



పంచప్రాణాలుగా ఉండేది. కూతురి అందాన్ని చూస్తూ వారి ఆనందానికి హద్దులుండేవి కావు.

## మాధవి దూరమయింది:

ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఒకసారి ఇంద్రోత్సవ సమయం ఆసన్నమైంది. కోవలన్, మాధవి తమ విహారానికి కావేరి నది సముద్రంలో కలిసే ప్రదేశాన్ని తగిన ప్రదేశంగా నిర్ణయించి అక్కడ ఒక గుడారాన్ని నిర్మించుకొన్నారు. ప్రజలు కూడా ఎక్కువగా అక్కడే చేరారు. ఆ సుందరదృశ్యం హృదయానందంగా ఉండింది. మాధవి శ్రుతి చేసిన వీణను కోవలన్‌కు ఇచ్చింది. కావేరి నదిని, సముద్రుడనే రాజును చేరుతున్న కన్యగా పోల్చి ఆ సుందర దృశ్యాన్ని మనోజ్ఞంగా పాడాడు కోవలన్. మాధవి అదే పాటను, అదే వీణతో చోళరాజు ఎదుట పాడింది. ఇది విన్న కోవలన్ తప్పుగా అర్థం చేసుకొన్నాడు. ఆమె మనసులో మరెవరినో కోరుకుంటోందనుకొన్నాడు. అంతే. తర్వాత పాటలే



వినలేదు. ఏమీ మాట్లాడకుండా సేవకులను తీసికొని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

మాధవి కలవరపాటు చెందింది. దుఃఖం పొంగుకొచ్చింది. నిజానికామె కోవలన్ మీదనే ఆ పాట పాడింది. కోవలన్ తన దగ్గరికి వస్తాడన్న నమ్మకంతో, బరువెక్కిన హృదయంతో ఆమె ఇంటికి వెళ్ళింది.

## మరలా కన్నగి దగ్గరికి:

ఇన్నిరోజులూ కన్నగి దుఃఖంతో ఇంట్లోనే గడుపుతూ ఉండింది. ఆమె చిన్ననాటి స్నేహితురాలైన దేవంది ఆమె దగ్గరికొచ్చింది. 'ఎందుకింత దుఃఖంతో ఉన్నా'వని ప్రశ్నించింది. కన్నగి అంతకుముందు రాత్రి తనకువచ్చిన పీడ కలను చెప్పసాగింది. ఆ కలలో కన్నగి తన భర్తతో కలిసి ఏదో రాజ్యానికి వెళ్ళినట్లు, అక్కడ అతడు ఏదో పెద్ద రాజనిందకు గురైనట్లు, తాను రాజసభకు వెళ్ళి వాదించి ఆ రాజుకు, ఆ నగరానికి శాపమిచ్చి నాశనం చేసినట్లు తర్వాత తన భర్తను చేరినట్లు చెప్పింది.

ఇది విన్న దేవంది ఇది అశుభసూచకమని నీవు కావేరి సముద్రాన్ని చేరే స్థలంలోనున్న మన్మథుని గుడికి వెళ్ళి పూజించి, ఆశీర్వాదాలను పొందితే నీ భర్తను చేరగలవని చెప్పింది. అందుకు కన్నగి తన భర్తే తనకు దైవమని వేరే దైవపూజలనవసరమని అన్నది.

వారిలా మాట్లాడుకొంటూ ఉండగానే కోవలన్ ఇంట్లోకొచ్చాడు. కన్నగి కళ్ళు ఆనందంతో వికసించాయి. కోవలన్‌కు ఆమె కళ్ళలో అంతకుముందు లేని కాంతి కనపడింది. ఆమె దేహం పూర్తిగా చిక్కిపోయింది. అతనికి కూడా దుఃఖం పొంగుకొచ్చింది. ఆమెతో ఇలా అన్నాడు "కన్నగీ నేను నిన్ను వంచించి ఇన్నిరోజులూ దూరంగా ఉన్నాను. ఒక మోసకత్తెను ప్రేమించి ధనమంతా పోగొట్టుకున్నాను. నీలాంటి ఉత్తమురాలిని బాధించినందుకు సిగ్గుపడుతున్నాను". అతనితో కన్నగి "జరిగిన దానికి మీరు చింతించకండి. ధనం లేదని బాధపడకండి. మీ సంతోషానికి ఎలాటి కొరతా ఉండదు. నా దగ్గర మా తల్లి ఇచ్చిన



అందెలున్నాయి. అవి చాల విలువైనవి. అవి తీసుకువెళ్ళండి" అన్నది. ఆమె ఔదార్యానికి కోవలన్‌కు సంతోషంతో పాటు దుఃఖం కూడా కలిగింది. ఆమెతో "ఇందులో ఒకదానిని అమ్మినా ఎంతో ధనమొస్తుంది. దానితో వ్యాపారం చేసి ధనాన్ని సంపాదించవచ్చును. ఈ ఊరు వదలి మరెక్కడైనా వెళ్ళి సుఖంగా జీవించుదాం" అన్నాడు.

## మధురకు:

కన్నగి తన భర్తమాటకు ఎదురు చెప్పలేదు. ఆ రాత్రే ఇద్దరూ ప్రయాణమయ్యారు. దారిలో వారికి కవుందిఆడిగళ్ అనే ప్రసిద్ధుడైన జైనసన్యాసి పరిచయమయ్యాడు. అతడు వాళ్ళను పలకరించి వాళ్ళ విషయాలు తెలిసికొన్నాడు. వాళ్ళతో "మీరిద్దరే ప్రయాణమవడం క్షేమం కాదు. నేనూ మీతోపాటే మధురకు వస్తాను" అని వాళ్ళతో కలిసి ప్రయాణమయ్యాడు.

అది వేసవికాలం. ప్రయాణం చాలా కష్టంగా ఉంది. సాధ్యమైనంత వరకూ మాత్రమే పగలు ప్రయాణం చేస్తూ



రాత్రిపూట చల్లని వెన్నెల్లో ఎక్కువగా ప్రయాణం సాగించేవారు. ప్రయాణ బడలిక తెలియకుండా ఉండడానికి కవుందిఆడిగళ్ పాండ్యరాజు వైభవాన్ని, కీర్తిని, న్యాయపాలనను, ధర్మబుద్ధిని వివరించసాగాడు.

ఇలా ప్రయాణం చేస్తూ ఒకనాటి ఉదయాన వాళ్ళు మధుర సమీప ప్రాంతానికొచ్చారు. అక్కడ దేవాలయాల్లో మ్రోగించ బడుతోన్న ఢంకా శబ్దాలు, మంగళధ్వనులు వినిపించసాగాయి. మధుర నగరం చుట్టూ ప్రవహిస్తున్న వైగానది సమీపానికి ముగ్గురూ వచ్చారు. ఒక చిన్న పడవలో ఆ నదిదాటి నగర ప్రధాన ద్వారం దగ్గరికొచ్చారు. కన్నగి మనస్సు అదోలాగుంది. అంతకుమునుపు ఆమెకొచ్చిన పీడ కలే గుర్తుకు రాసాగింది. అయినా ఆమె ఎలాంటి విసుగూ, భయమూ కనబరచడంలేదు. ఆమెకు కావాల్సింది భర్త సంతోషంగా ఉండడమే.



మహద్వారం తెరచి మధురానగరాన్ని ప్రవేశించారు. బాగా ఉదయమయ్యేసరికి ఒక బ్రాహ్మణ అగ్రహారానికొచ్చారు. కవుంది ఆడిగళన్ను, కన్నగిని అక్కడే వదలి కోవలన్ స్నానం పూజ చేసుకోవడానికి ఒక కొలనుకు వెళ్ళాడు.

## మాధవి లేఖ

మాధవి పాడిన పాటను తప్పుగా అర్థం చేసుకొని కోపంతో ఆమెను వదలి వచ్చాడు కోవలన్. అతడు కోపంతో వెళ్ళిపోయినా మళ్ళీ వస్తాడనుకొని మాధవి ఇంటికి వెళ్ళింది. అతనికోసం ఎన్నో రోజులు ఎదురుచూసింది. ఏమీ సహించడం లేదు. ఎప్పుడూ కన్నీళ్ళే. కోవలన్ మాత్రం తిరిగి రాలేదు.

చివరికామెకు కోవలన్ ఊరువదలి వెళ్ళిపోయినట్టు తెలిసింది. పాపం ఆమె ఏంచేయాలి? ఆమెకు కేశికన్ అనే బ్రాహ్మణుడు బాగా పరిచయమున్నవాడు. అతనితో "కోవలన్‌కు ఒక ఉత్తరం రాసిస్తాను. దయచేసి ఎలాగైనా వెదికి అతని కందించండి" అని వేడుకొన్నది. అందుకతడొప్పుకున్నాడు.

మధురలో స్నానానికి కోవలన్ వెళ్ళిన కొలను దగ్గరికే అనుకోకుండా కేశికన్ కూడా వచ్చాడు. బాధతోనున్న ముఖం, కృశించిన శరీరం – ఉన్న కోవలన్ను చూసి కేశికన్‌కు అనుమానమొచ్చింది. అతడు కోవలన్ అవునో కాదో తెలిసికోవడం కోసం "అయ్యో మాధవీ! నీకెంత కష్టమొచ్చింది. కోవలన్ విడిచిపెట్టిన తర్వాత ఎంత కృశించిపోయావు" అన్నాడు.

ఈ మాటలు విన్న కోవలన్‌కు ఆశ్చర్యమైంది. మాధవే తన విషయాన్ని ఇలా చెప్పి ఉంటుందనుకొన్నాడు. అతనితో "నీవంటున్న దెవరివిషయం" అన్నాడు. కేశికన్‌కు ఇతడే కోవలన్ అని తెలిసిపోయింది. అతనితో "అయ్యా కోవలన్! నీ తల్లిదండ్రులు నీవు రానందుకు ఏడుస్తున్నారు. మీ బంధువులందరూ బ్రతికున్నా చనిపోయిన వారిలాగే ఉన్నారు. నిన్ను వెదకడానికి అన్నివైపులా మనుషులను పంపారు. నన్ను మాధవి పంపింది. ఎంతో దుఃఖంతో ఉండడంవల్ల ఆమె రాలేకపోయింది. నీకోసం కలవరిస్తోంది. ఆమె బాధనంతా నాతో చెప్పింది. ఉత్తరం రాసి



ఎలాగైనా నిన్ను కలుసుకొని ఇవ్వమన్నది" అని మాధవి రాసిచ్చిన ఉత్తరాన్నిచ్చాడు.

కేశికన్ నుండి ఉత్తరాన్ని తీసుకున్న కోవలన్‌కు తాను మాధవితో సంతోషంగా గడిపిన రోజులు గుర్తుకొచ్చాయి. కళ్ళలో నీళ్ళొచ్చాయి. ఉత్తరాన్ని తీసికొన్నా చదవకుండా ఒక నిమిషం అలాగే ఉండిపోయాడు. తర్వాత చదవసాగాడు.

"మీ పాదపద్మములకు నా హృదయపూర్వక నమస్కారాలు. నేను పాడినపాట మీకు మరో అర్థాన్నిస్తుందని తెలియక పాడాను. నా తెలివితక్కువతనం కారణంగా మీరు అర్ధరాత్రి మీ తల్లిదండ్రులకు చెప్పకుండా నగరాన్ని వదలివెళ్ళిపోయారు. మీరెక్కడున్నా క్షేమంగా ఉండాలి. ఇదే నా కోరిక. మీకు నా హృదయపూర్వక నమస్కారాలు" – అని రాసింది మాధవి.

ఇది చదివిన కోవలన్‌కు తాను మాధవి పాడిన పాటను తప్పుగా అర్థం చేసికొన్నట్లు, ఆమె నిరపరాధియైనట్లు



తెలిసిపోయింది. ఆ ఉత్తరాన్ని కేశికన్‌కే ఇచ్చి "ఈ ఉత్తరాన్ని నా తల్లిదండ్రులకు అందజేయి" అని అక్కడినుండి వెళ్ళిపోయాడు.

కోవలన్, కవుందిఆడిగళ్, కన్నగిలతో కలిసి మళ్ళీ ప్రయాణమయ్యాడు. మధురకు దగ్గరే ఒక భద్రకాళి దేవాలయముంది. ముగ్గురూ అక్కడికొచ్చారు. అక్కడే మాదరి అనే ఒకావెు నివసిస్తోంది. కవుందిఆడిగళ్‌కు ఆమె పరిచయస్తురాలు. అతనికామె నమస్కరించింది. అతడామెతో "మాదరీ! వీరు పుణ్యదంపతులు. వీరిది కావేరి పట్టణం. ఒకప్పుడు సర్వసుఖాలూ అనుభవించారు. దురదృష్టంతో ఇప్పుడు బీదవాళ్ళయ్యారు. ఒక నెలరోజులు వీళ్ళను కాపాడడం నీ కర్తవ్యం" అని చెప్పాడు. ఆ దంపతులను చూసి ఆమెకూ పూజ్యభావం కలిగింది. సంతోషంగా వారిని ఆదరించింది. కవుందిఆడిగళ్ తృప్తిగా తన దారిన తాను వెళ్ళిపోయాడు.

కోవలన్ కన్నగిలకు మాదరి ఒక చిన్న గుడిసెను నివాసంగా ఏర్పాటు చేసింది. వంటకు కావాల్సిన పాత్రలు, పదార్థాలు



ఇచ్చింది. కన్నగి వంట చేసి సంతోషంగా భర్తకు వడ్డించింది. ఇలా వారిద్దరూ కలిసి ఆనందంగా కొన్నిరోజులు గడిపారు. కోవలన్, తాను కన్నగి సంతోషంగా జీవించాలి అని యోచిస్తూనే ఉండేవాడు.

**రాజకంసాలి:**

జీవితం గడవడం కోసం భర్తయినవాడు ఏదో పని చేయకతప్పదు కదా! కన్నగి దగ్గరున్న ఒక కాలి అందెను అమ్మడానికి తీర్మానించారు. కోవలన్ దాన్ని తీసికొని రాజకంసాలి ఉన్న వీధికి వెళ్ళాడు.

దారిలోనే రాజనగరు నుండి తన పరివారంతో వస్తూన్న కంసాలిని చూశాడు కోవలన్. అతనితో "అయ్యా! ఈ అందెలు చాలా విలువైనవి. వీటిని వెలగట్టండి. ఎవరైనా తీసికొంటారా? అన్నాడు. కంసాలి ఆ అందెలను చేతిలోకి తీసికొని పరీక్షించాడు. దాని అందానికి, దాన్ని చేసిన వాని నైపుణ్యానికి ఆశ్చర్యపడ్డాడు.

అప్పటికే మహారాణి ఒక కాలి అందెలు దొంగలింపబడ్డాయి. రాజ్యమంతా దానికోసం గాలిస్తున్నారు. నిజానికి రాణిగారి అందెలను దొంగలించింది కంసాలే. కోవలన్ ఇచ్చిన అందెలను చూస్తున్న కంసాలికి రాణి అందెలు గుర్తుకొచ్చాయి. ఆ ఇద్దరి అందెలకు ఏ తేడా లేదు. నూటికి నూరుపాళ్ళు ఒక్కలాగే ఉన్నాయి. ఆ కంసాలికి ఒక దురాలోచనొచ్చింది. ఈ అందెలను రాజుకు చూపించి, రాణిగారి అందెలను దొంగలించిన దొంగ దొరికాడని చెప్పి కోవలన్ను అపరాధిగా నిరూపిస్తే తాను చేసిన దొంగతనం నుండి తప్పించుకోవచ్చును. ఇలా ఆలోచించిన కంసాలి కోవలన్‌తో చాలా స్నేహంగా మాట్లాడి "ఇది చాలా గొప్ప నగ. దీన్ని కొనడానికి ఈ ఊళ్ళో ఎవరికీ సాధ్యం కాదు. రాజే కొనాలి దీన్ని. నీవు ఈ దేవాలయం సమీపంలో కొంతసేపు విశ్రాంతి తీసికొంటూ ఉండు. నేను రాజనగరుకు వెళ్ళి రాజుకు చూపించి దీనికి ఎంత ధనమిస్తారో కనుక్కొని వస్తాను" అని ఆ అందెలను తీసికొని రాజనగరుకు వెళ్ళాడు. విధి కోవలన్ను మూర్ఖునిగా చేసింది. దేవాలయంలో పిచ్చివానిలాగా కూర్చొన్నాడు.



## దొంగను చంపండి! - చంపడమయింది:

మోసకారి అయిన ఆ కంసాలి రాజనగరులో ప్రవేశించే సరికి రాజాస్థానంలో ఒక గొప్ప నృత్య ప్రదర్శన జరుగుతోంది. రాజు ఆ నృత్యాన్ని చాలా ఆసక్తితో చూస్తున్నా పట్టపురాణి పాలదిమా దేవికి విసుగ్గా ఉంది. తలనొప్పిగా ఉందని చెప్పి ఆమె సభామందిరం నుండి వెళ్ళిపోయింది. ఆమెకు కోపమొచ్చిందని రాజుకు అర్థమైపోయింది. నృత్యమైన తర్వాత ఆమెను సమాధానపరచడం కోసం రాజు త్వరత్వరగా వెళ్తున్న సమయంలో కంసాలి నమస్కారం చేసి "మహారాజా! రాణిగారి అందెలను దొంగలించిన దొంగను అందెలతో సహా పట్టుకొన్నాను" అని చెప్పాడు.

రాణికి కోపమొచ్చిందని రాజు అసలే విసుగ్గా ఉన్నాడు. ఆ సమయంలో కంసాలి మాటలు విన్నాడు. ఏమాత్రం ఆలోచించకుండా "అతని చేతిలో అందెలుంటే అతడే దొంగ.



అతనికి మరణదండనే శిక్ష. అతన్ని చంపి అందెలను తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు.

కంసాలి రాజసేవకులను తీసికొని కోవలన్ ఉన్న ప్రదేశానికొచ్చాడు. పాపం కోవలన్ వీళ్ళను చూడలేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చొన్నాడు. కంసాలి దూరంగా నిల్చుకొని సేవకులతో "అక్కడ కూర్చున్నవాడే మనరాణి అందెలను దొంగలించినవాడు. రాజాజ్ఞను పాటించండి" అన్నాడు.

రాజసేవకులు కోవలన్ను చూశారు. వారిలో ఒకరు కంసాలితో "అయ్యా! ఇక్కడ కూర్చొన్న మనిషిని చూస్తుంటే దొంగగా కనిపించడం లేదు. దొంగతనం చేసినవాని ముఖంలో ఉండాల్సిన భయం ఇతని ముఖంలో కనిపించడం లేదు. ఇతనిని బంధించడం న్యాయం కాదు" అన్నాడు.

కంసాలి తెలివైనవాడు. అతడు "మూర్ఖులారా! మీకు దొంగల విషయాలు తెలియవు. ఇంద్రునికి తెలియకుండా అతని మెడలోని



హారాన్ని దొంగలించే దొంగలున్నారు. రాజాజ్ఞ ప్రకారం ఇతన్ని చంపకపోతే మీ కళ్ళు కప్పి వెళ్లిపోతాడు. అలా జరిగిందంటే మనరాజు కోపాగ్నిలో మీరు నేను కూడా కాలిపోతాం" అన్నాడు.

కంసాలి ఒకనితో ఇలా మాట్లాడుతూ ఉండగానే ఇంకొక సేవకుడు ఖడ్గాన్ని తీసి కోవలన్ను నరికేశాడు. తల తెగి నేలమీద పడింది. రక్తం భూమ్మీద చిమ్మింది.

## ఏ అపరాధం కోసం?

ఈ సమయంలో కన్నగితో కూడానున్న మాదరికి అనేక అపశకునాలు కలిగాయి. మనసంతా ఏదో అనుమానంతో ఉంది. కన్నగి భర్తరాకకోసం ఎదురుచూస్తోంది. సాయంకాలమైనా అతడు రాలేదు. ఆమె మనసులో కూడా ఏదో భయం, అనుమానమూ ఉంది. నిమిషనిమిషానికి ఆమెకు ఆతృత ఎక్కువకాసాగింది. మాదరి కన్నగిని సమాధానపరుస్తోంది. అక్కడున్న అమ్మాయిలందరూ కలసి వారి కులదైవమైన శ్రీకృష్ణుని ప్రార్థించారు.

## ఆ రాత్రి గడిచి ఉదయమైంది:

మాదరి వైగానదికి స్నానానికి వెళ్ళింది. భర్త రాలేదన్న బాధతో కన్నగి ఆలోచిస్తోంది. ఉదయమే, అక్కడి అమ్మాయిలు రాజనగరుకు పాలు తీసుకొనిపోతూ కోవలన్‌కు జరిగిన అన్యాయం విన్నారు. వెంటనే వారు మాదరి ఇంటికొచ్చారు. ఆమె ఇంట్లో లేకపోవడంతో చుట్టుపక్కలనున్న అమ్మాయిలతో కోవలన్ మరణించిన విషయాన్ని చెప్పసాగారు. వారి మాటలు విన్న కన్నగి నిశ్చేష్టురాలైపోయింది. దుఃఖాన్ని ఆపుకోలేక అలాగే కూలబడిపోయింది. "కోవలన్ అందెలను దొంగలించిన దొంగ అని రాజసేవకులు అతన్ని చంపేశారు".

ఈ మాటలు విన్న కన్నగికి భరించరాని దుఃఖంతోపాటు పట్టరాని కోపం కూడా వచ్చింది. తన భర్త చనిపోవడమేగాక ఈ అపనిందకూడానా? ఆమె ఉగ్రురాలైంది. విరబోసిన తలతో తన దగ్గరున్న మరో కాలి అందెలను తీసికొని వీధిలో అరుస్తూ



పరుగెత్తసాగింది. భయంకరమైన ఆమెరూపాన్ని చూసి ఎవరూ ఆపలేకపోయారు? ప్రజలు "మనరాజు అపరాధం చేశాడు. మన సంస్కృతి పతనమైంది. న్యాయాన్యాయాలను తీర్మానించకుండా రాజు ఇలా ప్రవర్తించడంతో పాండ్యరాజుల కీర్తి మట్టిలో కలిసిపోయింది" అని అనుకోసాగారు. కన్నగి "అయ్యా! ఇక్కడ న్యాయమే లేదా? నా మొరాలించేవారే లేరా?'' అంటూ పరుగెత్తుతోంది.

అలా పరుగెత్తుతూ కోవలన్ మృతదేహం పడున్న స్థలానికొచ్చింది. భర్త దేహాన్ని చూసి ఆమె దుఃఖం పొంగుకొచ్చింది. అతని శరీరం మీద దభేలుమని కూలిపోయింది. వెక్కివెక్కి ఏడుస్తూ "స్వామీ కోమలమైన శరీరానికి ఇంత ఘోర శిక్షా? ఏం అపరాధం చేశారని? నిరపరాధిని చంపడానికెవరి మనస్సు ఇష్టపడింది?" అంటూ ఏడ్చింది. రక్తంమడుగులో పడున్న తలను దేహానికి జోడించి తన తొడమీద పెట్టుకొని "ఇంతగా విలపిస్తున్న నాతో ఒకసారి మాట్లాడండి ప్రభూ?" అంటూ ప్రార్థించసాగింది.



తన భర్త శవం "నీవు ఇక్కడే ఉండి నేను నిరపరాధి అని నిరూపించు. నాకొచ్చిన నిందను మాపు" అని అంటున్నట్లుగా భావించింది కన్నగి. తక్షణమే అక్కడినుంచి లేచింది. అతని రక్తాన్ని వీరతిలకంగా పెట్టుకొని చేతిలో అందెలను తీసికొని పాండ్యరాజైన నెదుంజళియన్ దగ్గరికి బయల్దేరింది.

## రాజా నీవు అధర్ముడవు:

కోవలన్ చంపబడ్డ రాత్రి పాండ్యరాజు భార్యకు ఒక భయంకరమైన కల వచ్చింది. ఆమె రాజుకు ఆ కలను ఇలా వివరించింది. "ఆ కలలో నాలుగు దిక్కులు వణకిపోతున్నట్లుంది. న్యాయగంట శబ్దం చేస్తూనే ఉండింది. సూర్యుణ్ణి కారుమబ్బులు పూర్తిగా మింగేశాయి. పగలే నక్షత్రాలు రాలుతూ ఉన్నాయి. రాజదండం, ఛత్రం, క్రిందపడిపోయాయి. ఇవన్నీ చూసి నా మనసు చాలా కలవరపాటు చెందింది". ఇది విన్నరాజు రాణికి ధైర్యం చెప్పి రాజకార్యాల్లో నిమగ్నుడయ్యాడు.



భర్త శవాన్ని వదలి వచ్చిన కన్నగి రాజనగరు ద్వారం దగ్గరికొచ్చింది. అక్కడున్న కావలివాళ్ళు సుకుమారమైన స్త్రీ ఇంత కోపంతో దూసుకురావడం చూశారు. ఆమె "బుద్ధిహీనుడైన రాజసేవకులారా! మొదట తలపులు తెరిచి రాజును చూడడానికి నన్ను లోపలికి పంపండి" అన్నది.

ఆ మాటలు విని, ఆమె రూపాన్ని చూసి వారు ఆశ్చర్యపోయారు. అందులో ఒకడు తన మనస్సులో "ఈమె ఈ ఊరిలోని ఆమెగా కన్పించడం లేదు. ఎంత భయంకర స్వరూపంతో ఉంది. ఏమైనా కానీ ఈమెను లోపలికి పంపాలి" అని భావించాడు. కన్నగితో "అమ్మా కొంతసేపు ఆగు. నేను లోపలికి వెళ్ళి రాజుగారికి నీ కోరిక విన్నవించి వస్తాను" అని లోపలికి వెళ్ళాడు. రాజుతో "స్వామీ! ఒక స్త్రీ న్యాయం కావాలంటూ మీ వద్దకు వచ్చింది. ఆమెను లోపలికి తీసుకురమ్మంటారా? అని విన్నవించుకొన్నాడు. ప్రక్కనే కూర్చొని ఆ మాటలువిన్న రాణి హృదయాన్ని ఏదో భయం ఆవరించింది. రాజు ఆమెను తీసుకురమ్మన్నాడు.

కన్నగి భద్రకాళిలాగ రాజసభలో ప్రవేశించింది. ఎర్రని కళ్ళు, విరబోసిన తల, నొసట రక్తతిలకం – ఆమె చూడ్డానికే భయంకరంగా ఉంది. ఆమె రూపాన్ని చూసిన రాజు రాణి కలతచెందారు. ఒక సుడిగాలిలా ప్రవేశిస్తోందామె. రాజ దంపతులను చూసి ఒక్క నిమిషం అలాగే నిలబడిందామె. “అమ్మా! నీవెవరు? ఏం జరిగింది? ఇంత కోపమెందుకు?” అన్న రాజుతో “బుద్ధిలేని రాజా! నేనెవరని అడుగుతున్నావా? పావురాన్ని కాపాడ్డానికి గద్దకు తన తొడ మాంసం కోసిచ్చిన శిబిచక్రవర్తి పరిపాలించిన దేశానికి చెందినదాన్ని. కావేరి పట్టణంలోని వర్తకుల్లో ప్రసిద్ధుడైన కోవలన్ భార్యను. నీ రాజ్యంలో నిరపరాధియైన నా భర్తకు మరణశిక్షపడింది. అన్యాయంగా చంపబడిన ఆ కోవలన్ భార్యనే నేను” అన్నది. “అమ్మా! ద్రోహిని శిక్షించడం రాజధర్మం. అది అన్యాయం కాదు. ఇది మా రాజనీతి” అన్న రాజుతో “రాజా! నీకు ఏది న్యాయమో, ఏది అన్యాయమో తెలియదు. నీవు అధర్మడవు” అన్నది.



## అందెలు ఎవరివి?

రాజు “అమ్మా! నీ భర్త రాణి అందెను దొంగలించాడు. అది అతనిదగ్గరే దొరికింది. దాన్నిబట్టి అతడే దొంగ అని తెలుస్తోంది. అందుకే శిక్షింపబడ్డాడు. ఇందులో తప్పేముంది” అన్నాడు.

“రాజా! అది నీ భార్య అందెలు కాదు. నాది”

“అమ్మా! రాణి అందెలోపల ముత్యాలున్నాయి”

“రాజా! నా అందెలోపల నవమాణిక్యాలున్నాయి”

ఈ మాటలువిన్న రాజు ఆశ్చర్యం చెందాడు.

“అలా అయితే ఆ అందెలను పరీక్షిద్దాం” అన్నాడు.

కోవలన్ దగ్గర దొరికిన అందెలు రాజకంసాలి దగ్గరే ఉన్నాయి. రాజు అతన్ని కబురుపెట్టాడు. కన్నగి అందెలను తీసికొని సింహాసనం మెట్లెక్కి పైకి వెళ్ళింది.



అందెలను తీయడంతోనే నవమాణిక్యాలు కిందపడ్డాయి. ఒక మాణిక్యం రాజు నుదుటికి తగిలింది.

రాజుకు తాను చేసిన తప్పు తెలిసిపోయింది. నిశ్చేష్టుడైపోయాడు. మరణశిక్ష అమలు జరిగిపోయింది. “అయ్యో! ఒక కంసాలి మాటలు నమ్మి ధర్మవిరుద్ధంగా ప్రవర్తించిన నేను ఈ రాజ్యానికి రాజుగా ఉండే యోగ్యత లేదు. నా జీవితం ఇంతటితో ముగిసిపోవాలి” అని రాజు దుఃఖించాడు. ఆ దుఃఖంతోనే అక్కడికక్కడే అతడు మరణించాడు. రాణి కూడా దుఃఖాన్ని భరించలేక రాజు పాదాలదగ్గరే పడి ప్రాణాలు వదలింది.

కన్నగి ఆ ఘోరదృశ్యాన్ని చూడలేక సభనుండి వెలుపలికి వచ్చింది. ఆమె కోపమింకా చల్లారలేదు. “ఈ నగరం కూలిపోవుగాక” అంటూ శాపమిచ్చింది. నిష్కల్మషంగా జీవించిన కన్నగి శాపం వెంటనే ఫలించింది. ఎక్కడచూసినా అగ్నిజ్వాలలే. సకల సౌభాగ్యాలతో కూడిన ఆ నగరం అగ్నిలో నాశనమైపోయింది.



## ఇలా ఎందుకు జరిగింది?

అప్పుడు నగర దేవత మధురాదేవి కన్నగికి ప్రత్యక్షమై “అమ్మా! నీ దుఃఖాన్ని నేను ఆలకించాను. నా మాట విను. పాండ్యరాజులు నీతిపరులు. రాజు చేసిన అన్యాయానికి కారణం లేకపోలేదు. నీ పూర్వజన్మ కర్మననుసరించి ఈవిధంగా కష్టాలనుభవించాల్సి వచ్చింది” అని కన్నగి పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పసాగింది. సింగపూర్ దేశాన్ని వసు అనేరాజు పరిపాలించేవాడు. ఒకరోజు సింగపుర వీధుల్లో సెంగమ అనే అతడు వ్యాపారానికొచ్చాడు. భరత అనే రాజభటుడు అతన్ని చూసి శత్రుదేశపు గూఢచారి అని రాజుదగ్గరికి తీసుకెళ్ళాడు. నిరపరాధి అయిన అతనికి రాజు మరణదండన విధించాడు. ఈ దుఃఖాన్ని భరించలేక సంగముని భార్య అయిన నీలి ఊరు వదలివెళ్ళి పోయింది. దగ్గరలోనే ఉన్న కొండమీద పధ్నాలుగు రోజులు అలాగే దుఃఖిస్తూ గడిపింది. తర్వాత “నా దుఃఖానికి కారణమైన వారుగూడ నాలాగే దుఃఖాన్ని అనుభవింతురుగాక” అని శపించి

ఆ కొండమీద నుండి దూకి మరణించింది. ఆ భరతుడే కోవలన్‌గా నీకు భర్తయ్యాడు. నీవుకూడా నీ భర్తను పధ్నాలుగు రోజుల్లో చేరుతావు" అని కన్నగిని శాంతపరిచి మధురాదేవి మాయమైంది. నగరాన్ని తగలబెడుతున్న అగ్నిని కన్నగి శాంతపరిచింది.

**మరలా కన్నగి కోవలన్ కలయిక:**

కన్నగి ఆ ఊరువదలి రాత్రి పగలు ప్రయాణంచేసి చేరరాజ్య రాజధాని అయిన వంజి నగరానికొచ్చింది. అక్కడ ఒక పెద్ద కొండ మీదికి వెళ్ళి ఒక చెట్టుక్రింద తన భర్తకోసం ఎదురుచూస్తూ నిలబడింది. పధ్నాలుగు రోజులు గడిచాయి. దేవతలు కోవలన్ను తీసుకొచ్చారు. దేవరథంలో కూర్చొని తన భర్తతోపాటు కన్నగి స్వర్గానికి వెళ్ళింది.

కన్నగి కోవలన్‌ల మరణం విని వారి తల్లిదండ్రులు చాలా దుఃఖించారు. వారి తల్లులు అగ్ని ప్రవేశం చేశారు. వారి తండ్రులు సంపదలంతా ధర్మం చేసి సన్యాసులయ్యారు. మాధవి కూడా



తన ధనమంతా దానం చేసి సన్యాసిని అయింది. కవుందిఆడిగళ్ మణిమేఖలకు గురువై ధర్మోపదేశం చేసిన వ్యక్తిగా ప్రసిద్ధిచెందాడు. ఆ దంపతులను కాపాడలేకపోతినేనన్న దుఃఖంతో మాదరి అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేసింది. కవుందిఆడిగళ్ ఇంతటి పుణ్యజీవులకు ఇలా జరిగిందే అని విచారించి "సల్లేఖనం" అనే వ్రతం స్వీకరించి ఈ ప్రపంచాన్నే వదలిపెట్టాడు.

ఈ కథంతా చేరరాజు శెంగుత్తవాన్‌కు తెలుసు. మధుర ఆస్థానం నుండి వచ్చిన కవి శాత్తనార్‌ను రాజు తమ్ముడు ఇళంగో ఆడిగళ్, రాణి చేరమాదేవి ఈ కథను వివరించమని అడిగారు. శాత్తనార్ తనకు తెలిసిన కథంతా చెప్పాడు.

కన్నగి కథ విన్న చేరమాదేవి హృదయం కరిగిపోయింది. ఆమె నీతి నియమాలకున్న అద్భుతశక్తికి ఆశ్చర్యం చెంది ఆ వీరవనితను స్మరించడానికి ఆమెకొక ఆలయాన్ని కట్టించమని శెంగుత్తవాన్ను ప్రార్థించింది. అందుకు రాజు అంగీకరించి



హిమాలయాలనుంచి అమృత శిలలను తెప్పించి కన్నగి ప్రతిమను చేయించి వంజినగరంలో ప్రతిష్ఠ చేయించాడు. ఈ ఉత్సవానికి హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకు ఉన్న రాజులంతా వచ్చారు. లంకనుంచి గజబాహుడనే రాజు వచ్చాడు. ఇప్పటికీ వంజి నగరంలోని స్త్రీలు తమ పిల్లలకు భగవతి అని పేరుపెట్టి కన్నగిని గౌరవిస్తూంటారు.

**శిలప్పదిగారం:**

కన్నగి కథను ఇళంగోఆడిగళ్ "శిలప్పదిగారం" అనే కావ్యంలో రసవత్తరంగా రాశాడు. (ఇళంగోఆడిగళ్ అనగా యువరాజు) శిలంబు అనగా అందె. దాని మహాత్మ్యాన్ని వివరించే కావ్యం "శిలప్పదిగారం" (రచన– క్రీ.శే. 2వ శతాబ్దం). ఈ కావ్యం తమిళభాషలో ఉంది. ఇప్పుడు లభిస్తున్న తమిళ కావ్యాల్లో ఇదే చాలా ప్రాచీనమైంది.



ఈ కావ్యం న్యాయమాహాత్మ్యాన్ని తెలియజేస్తుంది. చేసిన తప్పుకు శిక్ష తప్పక ఉంటుంది. తప్పు చేసిన వ్యక్తి శిక్షను ఇక్కడే అనుభవించాల్సి ఉంటుంది. తప్పుకు శిక్ష వెంటనే ఉండాలి. ఆలస్యమైతే శిక్ష జరక్కపోవడానికీ అవకాశముంది. ఉన్నత పదవిలో ఉన్నవాళ్ళు చాలా జాగ్రత్తగా నడచుకోవాలి. తప్పు చేస్తే వాళ్ళు కూడా శిక్షననుభవించి తీరాలి. అలా కాని వారివల్ల ప్రజలకు కలిగేది కష్టాలు, దుఃఖాలు మాత్రమే. పాండ్యరాజు తొందరపాటుతో చేసిన అన్యాయానికి మధురానగరమే కాలిపోయింది. సాధారణ వ్యక్తి అయినా, ఉన్నతాధికారంలో ఉన్నవాడైనా న్యాయానుసారంగా పరిపాలించాలి. అలా జరగని నాడు దుఃఖం, నాశనం తప్పదు.

